కిత్త: సూసినానులే. ఇదిగో అచ్చీ, ఒక్క మాట.

అచ్చి: యేంటది?

కిత్త: మనం మళ్ళీ యెప్పుడు కలుసుకోడం?

అచ్చి: (సిగ్గుతో) మన పెళ్ళప్పుడే. మావోళ్ల నొప్పించుకో.

కిత్త: మరి మీవోళ్ళొప్పుకొంటారా?

అచ్చి: పంచాంగం సదివినోడివి నీకు తెలకుండా వుంటాదా!

కిత్త: నా పంచాంగం, నీ పంచాంగం తెలుస్తాదిగాని, మీవోళ్ల పంచాంగం నాకెలా తెలుస్తాది?

అచ్చి: అయ్యోరికి దచ్చినిస్తే మనక్కావొలసిన పంచాంగం సెప్పదూ! మావోళ్ళక్కూడా యిమ్ముకొంటే, అళ్ళే సెప్తారు.

కిత్త: మరి నీపంచాంగం సెప్పడానికి నాకు దచ్చినొస్తాదా, రాదా! ఆ దాళ్ళ కిచ్చేది, నువ్వే వొప్పించు.

అచ్చి: సూసుకొందాములే. పొద్దోయింది. నాను పోతాను. మావోళ్ళు మంచోళ్ళు కారు. మన సంగతి తెలుస్తే యెముక లిరగ్గొడతారు.

కిత్త: మరి నీమనసేటో సెప్పినావుకావు.

అచ్చి: నీ మనుసే నా మనుసు.

కిత్త: అయితే సెగు. తూర్పు తెల్లారేసరికి తుంగబద్రి సేరుకొందాం.

అచ్చి: పద. నీ యిట్టమేకాని. (పాడుకొంటూపోతారు.)

అదిరా – నా – గుండె – బెదర – మధుర – వె – న్నెలలోన
నిసురకు – దూర మైతిని – గదర – చెల్ – మోహనరంగ – నిసురకు–.

కనుల – కాటుక బెట్టి – కడవ – చం – కను బెట్టి
కన్నీళ్లే – కడవ నింపాను – గదర – చెల్ – మోహనరంగ – కన్నీళ్లే

మంచిని ళ్లే – బావికాడ – మల్లెపూ – ల – తెప్పకట్టి
తెప్పమీ–ద – తేలిపోదాం – పదరా – చెల్ – మోహనరంగ – తెప్పమీద.

(పోతారు)

తెర.

---

## రంగము ౨.

(తుంగభద్రాతీరము. గుడిసెముందు చెట్టుకింద. అచ్చి, కిత్తయ్య.)

కిత్త: అచ్చీ, అవుల్ని దూడల్ని వొదిలినావా, మేతకి ?

అచ్చి: వొదిల్నా ; రా, కూకో కూడు తిందాం.

(కంచం పెట్టుకొని యిద్దరున్ను కూర్చుంటున్నారు.)

కిత్త: ఏమచ్చీ, నంచుకోడాని కేమీ సెయ్యానేదే!

అచ్చి: యిదిగో, యీ మాగడ నంచుకో.

కిత్త: నాలికి సురుర్రుమన్న ట్టేమీ లేకపోతే యెలా ?

అచ్చి: చెంప సుర్రుమనాల. మాగడ తినమంటే యేం తీపి దిగేసింది.

కిత్త: యెప్పుడూ మాగడే? యెప్పుడూ పాలే? యెప్పుడూ జున్నే? యిసుగెత్తి పోతున్నాది.

అచ్చి: నీ యచ్చికూడా యిసుగెత్తి పోతున్నాదేమో ?

కిత్త: అచ్చేల యిసుగెత్తుతాది! అయిటయిటికీ రుచి మారిపో-తావుంటాది నాయచ్చి. సేరదీసిందంటే తీపి; కసిరిందంటే కారం; వూరుకుంటే వుప్పు; దూరం పోయిందంటే

పుల్ల; సికాకుపడితే సేదు;—అన్ని కలుస్తేనే అచ్చి. నేకపోతే మొగం మొత్తిపోదూ?

అచ్చి: అయితే. నిను తీపి యిసుగెత్తిందన్నమాటె. కారమే కావాలగదా?

కిష్ట: తీపి తరవాత కారం; కారం తరవాత తీపి. యెలుతురు పోతే సీకటి; సీకటిపోతే యెలుతురు వొస్తుండవూ?

అచ్చి: నాకెప్పుడూ తీపే కావాల. యెప్పుడూ యెలుతురే కావాల. సీకటొస్తే దిగులేస్తాది.

కిష్ట: నా నుండగా నీకేటి దిగులు?

అచ్చి: దిగులేనబ్బా! నీమాట లింటావుంటే, ఆదేటో అర్థాలు తెగులుతా వుంటాయి, నా మనుసుకి. నాకు దినాము కలలే. రేతిరి నిదరొట్టడం లేదు.

కిష్ట: యేం కల లొచ్చినాయి?

అచ్చి: అదోడో నల్లగున్నాడు. మనగుడిసెలో దూరినాడు. మంచం కింద పొంచున్నాడంట. మనమాటలన్నీ యి-న్నాడంట. అబ్బా! అది తల్సుకొంటే వొళ్లు జల్లుమంటున్నాది.

కిష్ట: ఆడేమి సేసినాడేటి?

అచ్చి: మంచం కిందినుంచి మెల్లిగా వొస్తావుంటే, తుళ్ళిపడి నిగొంతుక గట్టిగా పట్టుకొన్నాను. (మెడ కౌగిలించుకొంటున్నది) ను వ్వుక్కిరిబిక్కిరయినావు. 'వొదులు, వొదులు' అని నన్నిడిపించుకొని దూరంగా పోనావు. తరవాత నాకు నువ్వు కనబడ్డమే నేను అడు నన్ను "నడు, నడు" అని గెంటుక పోయినాడు. అబ్బా మామా, నాకు బయమేస్తున్నాది.

కిత్ర: ఓస్ యెర్రిదానా, నానుండగా నీకేం బయం? రా, బువ్వతిను. తోటిగట్టుకు పోయి అవుల్నితోలుకొత్తాము. సూడు, మన లక్ష్మావు నేడో, రేపో యీనతాది సుమా. నాను సెప్పినాను సూడు, అది కోడెమాడ నేస్తాది.

అచ్చి: నేను, నేను, అవుదూడనే యేస్తాది. నీకేటి తెలుస్తాది, యీనడం సంగతి? మొగోడివిగనక మొగదూడంటావు.

కిత్ర: పందెమా, మరి?

అచ్చి: ఆ, పందెమే.

కిత్ర: యేం పందెం, సెప్పు.

అచ్చి: కోడె దూడనేస్తే నీది; పెయ్యదూడనేస్తే మనది.

కిత్ర: యెంతగడుసుది! నా నొప్పుకోను. మరొక్క పందెం సెప్పు.

అచ్చి: పెయ్యదూడనేస్తే, గుడిసెలో పనంతా సిది. కోడెదూడ నేస్తే బయటిపనంతా నాది.

కిత్త: అబ్బో, నాయచ్చీ! నన్నాడదాన్నిసేస్తావో? నువ్వు మొగోడివయి పెద్దరికాలు సేస్తావో? కానీలే, వొప్పు-కొన్నా.

అచ్చి: మామా, మామా, అనుగో యేటిమీంచి పడవొస్తున్నాది. యెప్పుడూ యీదిక్కు- పడవరానేదే! అల్లో ల్లో?

కిత్త: ఓల్లో, అల్లదారి నాల్లుపోతావున్నారు. మనకేల?

అచ్చి: మనకోస మోరయినా రానేనుగదా?

కిత్త: మనకోస మోకొస్తారు? మనమీడనున్నట్టు ఓలకీ తెలనులే.

అచ్చి: అ ల్లెంతసక్క-౦గా పాడతున్నారో! మామా. నీకా-పాటలేమేనా వొత్తాయా?

కిత్త: నాపాటల లచ్చి! యేం, నువ్వాపాటలు నేర్సుకొంటావా?

అచ్చి: యాదీ, వొక్క-పాట సెప్పు, నూదాము?

కిత్త: సేర్సుకో మడి.—

పొంగుతాదీ - జీవం - కుంగుతాదీ,
పొంగు కుంగు - పనియేముంది
తొంగున్నోడికి - తొరయేముంది

కుంగి నోడే – కొస కేలాగో
వొంగుతాడని – పోలుసుకోండి          పొంగు.

కింది కళ్లాలీ – మళ్లీ – మీదికళ్లాలి
కిందూ మీదూ – ఊగులాటన
అంద మంతా – అణగి ఉంది
కిందని కించ – పడకండి, మరి
మీదని మిడిసి – పడకండన్నా.          పొంగు.

అచ్చి: యెర్రి యేదాంతం. యాడ నేర్సినావు, మామా, యీ పాట!

కిష్ట: సిన్నప్పుడు కిట్టమీద తిరిగినాను. అకిట్టరయోయమ్మ తల్లి పేరే మాయమ్మ సాకట్టింది.

అచ్చి: పాటబాగుంది సుమా. యాదీ మరొక్కటి?

కిష్ట: (పాడుతున్నాడు)

యెత్తర తెరసాప – వోడమీది సిన్నవోడ...          యెత్తర

కోల కట్టిపెట్టరయ్యా – వోలపాట పాడరయ్యా
యేలరయ్యా అలసిపోతా – యింక కూసుమందుదాము...యెత్తర

రంగినీలు కట్టరయ్యా – రేవుకు మొగ పెట్టరయ్యా
లంగరెత్తు కొనివుండి – గంగమ్మకి దణ్ణమెట్టి...          యెత్తర

జాయచక్క-గుందిరయ్యా - హాయిగ పోతుందిరయ్యా
తోయగ నక్కరలేదు - తొందరగా నడుస్తాది... యెత్తర
ఎసరలేదు బెదరలేదు - సమనుగానె పోతున్నాది
అనునుచూచి కొయ్యనిలిపి - అంజాలు లాగిపట్టి... యెత్తర
గాలి నిండుకోని వుంది - కదిలిపోతున్నాది నావ
యేల నూస్తూవూరుకొంటూ - వెర్రిమొగ మేసుకోని...యెత్తర
చూపే సక్కనైననావ - సొంపులు గులికేటినావ
వోపవర్తకానికి సా - రాజ్యానికె శ్శైనావ... యెత్తర

అచ్చి: శాబాసు! వోరుకట్టినారో. యీ పదం? యెంత సక్కగుందో!

కిత్రా: వూ పపవమీ దొకయ్యో రుండేవోడులే. పేరు మరిసి-పోనాను. అఁ! అఁ! నారాణప్పయ్యో రాయనపేను. సూర్తానికేమీ తెలనట్టుండేవోడుగాని, యాడ కట్టేసే వోడో! పదాలంటే పదాలుకావు. ఆ అయ్యోరి కడుపు నిం...డా పదాలే.

అచ్చి: యాదీ, అయ్యోరి పదం, మరొక్కటి?

కిత్రా: రా, పాడుకొంటూ పోదాం: నువ్వూపాడు.—

దణ్ణాలే—దణ్ణాలు
మాతుంగ - బద్రిమ్మ - దణాలు

విండుదయతో నేలె — దణ్ణాలు
మాతుంగ — బద్రమ్మ — దణ్ణాలు
పొంగి పొ — ర్లి రాయే — దణ్ణాలు
మనసు — పొంగింపరావమ్మ — దణ్ణాలు
హాయ — హాయలై — రావమ్మ — దణ్ణాలు
పాడి — పంటల నివ్వవే — దణ్ణాలు
నిను నమ్ముకొన్నామె — దణ్ణాలు
తల్లి — నీదయ — చూపవే — దణ్ణాలు.

(పోతారు)

తెర.



## రంగము 3.

[తుంగభద్ర ఒడ్డు. కిత్తయ్య గుడిసె, గుడిసెలో అచ్చి. ఇద్దరు పడవవాళ్లు ప్రవేశము.]

ఒకడు: వోరయ్యో, గుడిసెలో?

(అచ్చి తలుపుతీసి ప్రవేశిస్తున్నది.)

అచ్చి: వోరదీ? వోరుమీరు?

రంగ: ముటిలో పడవ మెరకెక్కి పోనాది. తోయ్యాలంటే యీలులేకండావుంది. యీడ నేడయినా మొగోళ్లున్నారా?

అచ్చి: మాయింటోడు పశువు లెంట పోనాడు. మరోరూ నేను.

ఒకడు: యెంతసేపవుతాదో, వొచ్చేసరికి?

అచ్చి: అలబొద్దేళవుతాది. మద్దేన్న మింటికిరాడు. నానే కూడోట్టుక పోతా.

రంగ: అయితే, అయప్పొచ్చింవాకా యీడనే వుండాలగావాల.

అచ్చి: అక్కర్నేరు, పొండి. అనుగనుగో అకొండకాడ మర్రిసెట్టు నేమా? అడనుంటాడు. పిలుస్తే వొస్తాడు.

ఒకడు: మాము నడవలేము. ఎండబడి పోనాము.—పిల్లా, దాగానికి రన్నీళ్లు సిక్కుతాయా?

అచ్చి: దానికేం బాగ్గెం? (లోపలికి పోతున్నది.)

రెండో: వారే, యెంతసక్కగుందిరా, యిది? యీడనేలుందో? సుట్టుపక్క లేడా కొంపే కనబడదే!

ఒకడు: యేమిరో, దీనిమీద కన్నేసినావా, యేటి? నీకొక్క వాలా, సెప్పు.

రెండో: మరి సాయం సేత్తావా?

ఒకడు: ఆదెంత పనిలే.

రెండో: దాని మొగు డెలాంటోడో! ఆడిగ్గానా కనబడినా మంటే, సిక్కులో బడతామే!

ఒకడు: అవూసు నీకేల? వుండు. అదుగో వొస్తున్నాది.

(అచ్చి ప్రవేశము.)

అచ్చి: యిదుగో, దాగం పుచ్చుకోండి. (ఇస్తున్నది.)

ఒకడు: ఆహాహా. పానాలు లేసొచ్చినాయి. మజ్జిగతేట, మా బాగుంది! తాగురా నువ్వుకూడా.

రెండో: యేదీ? (అచ్చిపోస్తున్నది.)

అచ్చి: యేమన్నా, యింకా పొయ్యనా?

రెండో: మరొద్దు, మరొద్దు. కడుపు నిండిపోనాది.

అచ్చి: యావూరన్నా మీది ?

ఒకడు: మాది కానా కానా దూరం రాజ్యం.

అచ్చి: యెంతదూర ముంటాదో ?

రెండో: ఓయబ్బో! కానా కానా దూరం.

అచ్చి: ఇటేడ పోతున్నారో ?

ఒకడు: కానా కానా దూరం.

అచ్చి: అంటే యావూరో ?

రెండో: బెజవాడావల బందరు పోవాల.

అచ్చి: ఆ బందరీడకు పదిపరువు లుండీనా ?

ఒకడు: (నవ్వుతూ) ఎయ్యిపరువు లుంటాది. ఏకేం సూడాల-
సుందా ?

అచ్చి: నాకేల ? మాయింటో డొకనాడు అవూరిపేరు సెప్పితే
యాదికొచ్చి అడిగినాను.

రెండో: మీయింటోడి పేరేటి, పిల్లా ?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

ఒకడు: అయ్యో, అదే టలా సిగ్గొడతావు ?

అచ్చి: మామ మాయింటోడి పేరు చెప్పను.

రెండో: వోరే, మామంచి పిల్లరా; అలావుండాల ఆలుమగ-లంటే. అయితే, పిల్లా, యీడనొచ్చి వున్నారేటి? సుట్టుపక్క లోన్నిరూ నేరే! నీకు బయం నేదూ?

అచ్చి: నాకిత్తయ్యుంటే నాకేటి బయం?

ఒకడు: ఓహో, అదా నీయింటోడి పేరు?

అచ్చి: (సిగ్గుతో ఊరుకొంటున్నది.)

ఒకడు: (జ్ఞాపకము వచ్చినట్టు నటిస్తూ) ఏమేటి? కిత్తయ్యా? అడిపే రదేగదంటార్ని సెప్పినాడు?

రెండో: అవును, పాప మీపాటి కేమయుంటాడో! బతకొచ్చును,

అచ్చి: (భయముతో) వోరన్నా? యేం టంటున్నావు?

ఒకడు: పాపం, మేమొస్తావుంటే, నట్టేట్లో కిందా మీదా మునుగుతున్నాడు. పడవ బిరీని గడిపి, ఏట్లోకి సుమికి లోని కెక్కించినాము. కొనూపిరితో వున్నాడు. అడిని తీసుకపోయి యేటావల వూరిచావిడిలో యేసినాము. కడుపుమీదేసి నొక్కినాము. శానానీళ్లు బయటి కొచ్చేసినాయి. కొంచెం కళ్లు తెరిచినాడు. పేరడుగుతే 'కి-' అని మరి చెప్పనేకపోయినాడు. నీవూ రేదంటే యీ పక్కకి కళ్ళుతిప్పి, వూరుకొన్నాడు.

అచ్చి: ఆఁ! ఆఁ! నా కిత్తయ్యే; నాకిత్తయ్యే? నాకొంప ముంచేసినాడూ? అన్నా, నిజంగా నాకిత్తయ్యేనా?

రెండో: నీకిత్తయ్యో. యాకిత్తయ్యో, మాకెట్లా తెలుస్తాది.

అచ్చి: నూడూ, సామనసాయగా వుంటాడు గందా?

ఒకడు: అవును, కొంచెమలాగే వుంటాడు.

అచ్చి: నూనూగు మీసాలుంటాయిగందా?

రెండో: అవునవును. తుమ్మెదలలాగ న...ల్లగున్నాయి.

అచ్చి: నూడ స...క్కని మొకముగందా?

ఒకడు: ఆసక్కదనం నీకే తెలియాల.

అచ్చి: నీకంటా కసింత పొడుగ్గుంటాడుగందా?

ఒకడు: కొంచెం నాయెత్తే.

అచ్చి: దండలు తిరిగుంటాయి

రెండో: వో! మంచి బలంకలోడే. అంమళాతే అంతసేపు నీట్లో యీదినాడు. పాప మాఖరి కలిసిపోనాడు. యేం సేస్తాడు?

అచ్చి: నాకిత్తయ్యాలా నీటిలోకి దిగడే! సామీ దొట్టేసుకొన్నాడే, దిగనని!

# అచ్చి — కాపువలపు

ఒకడు: ఆవు నీటిలో దిగొడ్డాదంట. దానికోసం అతును దిగినాడు.

అచ్చి: అన్నా! అన్నా! సూడు! నాకిత్తయ్యకి కుడిబుగ్గ-మద్దని పుట్టుమచ్చ సూసినావా?

రెండో: అయ్యో, పాపం దీని మొగుడేనురా!

అచ్చి: పుట్టు మచ్చుంది? నాకిత్తయ్యో! నాకిత్తయ్యో! మామోయి, మామా! నాబతుకు కద్వాస్నం చేసినావురో! మామోయి, మామ! నన్నేడను పోతున్నావురో, మామా! నన్నోరి కొప్పిసెప్పినావురో, మామా, నా మామా!

ఒకడు: ఏందుకేడుస్తావు, పిల్లా? బతికుంటే ఆడేవొస్తాడు.

అచ్చి: నా పానాలుండవురో, నా మామా! నీ మొకమొదలగ, నా మామా! మరినాకు కనబడవా, నా మామా, నానుకూడా సచ్చిపోతానురో, నా మామ!

రెండో: యిదేటి పిల్లా, యిలా అపశకునంగా యేడుస్తావు! బతికే వుంటాడులే.

అచ్చి: బతికుంటాడా? అన్నా, నన్ను నాకిత్తయ్యకాడికి దిగబెట్టరా? యీ పుస్తెం కట్టుకోరా? యిటుగో, యీతోట, యీయిల్లు, యీయావులు, యీదూడలు,

అమ్మి మీకే యిచ్చేస్తా. నాకిత్తయ్యని నాకు సూపిం-చండేన్నా! మీ మేలు మరిసిపోను, నాయన్నా!

ఒకడు: ఇదేటిరా, యీగొడవ తెచ్చిపెట్టుకొన్నాము?

కంసాలి: పోనిలే. పాపం. ఊళ్లోగరిని చేర్చేసే పోదాము. ఊరకే కొట్టుకొంటున్నాది. మనకి పొద్దోతే పోయింది. నువ్వు ముందరపో. పసివని నీటిలోని కీడ్చివుంచు. నా సెనకి నించి యీపిల్లని తీసుకొస్తాను.

ఒకడు: నువ్వేపో, నానేతీసుకొస్తాను.

కంసాలి: అపిల్లి బయమేస్తాది. ఇద్దరమూ తీసుక పోవాములే. ఏం పిల్లా, గుడిసె వాకిలేసుకో; యేమేమి చూసు-కోవాలో చూసుకో.

అచ్చి: నాకేమీ, అక్కర్లేదన్నా! నాకేమీ అక్కర్లేదు. ఓరీని పదండి.

ఒకడు: ఆయితే రం, మరి.

అచ్చి: నా మామో, నా మామ!

(పోతారు.)



## రంగము ౪.

[తుంగభద్రి ఒడ్డు. గుడిసెముందు. కిష్టయ్య ప్రవేశము.]

కిష్ట: యేం, సెవ్వాశ్రీ, అచ్చి యీదినం యెదరగా రాలేదు! ఇంట్లో యాదోపని సేసుకోంటున్నాది కాబోల. యాదో యింమ సెయ్యాల ననుకోనుంటాది. దానికి తెలవకుండా యెళ్ళి కళ్ళుమూస్తా. (చప్పుడు చెయ్యకుండా నడుస్తున్నాడు. తొంగిచూచి)—యింట్లో నేదే! యాడనో దాంగోనుంటాది, నన్ను బయం పెట్టడానికి... తెలిసిందలే అచ్చీ, తెలిసిందిలే. వాకిలోరని దాంగున్నావో! రా, బయటికిరా. (పోయిచూస్తాడు.) ఈడ నేదే! ఓహో, మంచంకిందనో! (చూస్తాడు) అరే! యింట్లో లేనట్టే...సుట్టుపక్క లెక్కడా కనబడ నేదే! మద్దేన్నం కూడా కూడొట్టుకు రాలేదు. ఏటిగ్గానా పోయిందా? యెటొడ్డునుంచే వొచ్చినానే!—నేను, నేను, యీడనె యాడనోవుంటాది...అచ్చీ! అచ్చీ!...పలకనేదు. ఆఁ! అనుగమగో నాయచ్చి! (పోయి చూస్తాడు.) అయ్యో, యాదో తీగ...అచ్చీ! యాడకుపోయినా వచ్చీ'... అదిగో పలుకుతున్నది (చెవి ఒగ్గి విని) యాదో పచ్చి... అరుస్తున్నాది...అచ్చీ! పలుకవే మచ్చీ! నన్నెందుకు కాడిస్తావే, నాయచ్చీ! ఓరీనిరా...ఏం, రావేం? నామీద

కోపమొచ్చిందా? నానేం టన్నాను? (క్రిందికిచూచి) ఈడనేవో కొత్తఅడుగులు కనబడుతున్నాయి. వోరయి-నా వొచ్చినారో యీడకి? అరడుగులు....వోరయినా తీసుకుపోలేరు గద, నాయచ్చిని? గుండెల్లో దిగులొడుం గున్నాదే! యేంటీ యెడమకన్నదరడం? నాకొంప మునిగిపోయె! నాబతుకంతా గంగలో కలిసిపోయె! నాయచ్చి నన్నిడిచిపోయె!

ఎగిరిపోయెరా - చిలక - యెగిరిపోయెరా - గూడు
సిన్నబోయెరా - దాని - సిన్నెలేమరా.
చిట్టి - పలుకుల చిలక
సిన్ని - వన్నెల చిలక
కన్నుల కింపైన చిలక
కిట్లలోను ముమ్మరిగొట్టి.....యెగిరి
మంచి మంచి - మాటసెప్పి
మాటలకే - మరుపువొచ్చి
మరిచిపోయేటే - మాయసేసి
మాటయినా - సెప్పకుండ...యెగిరి

నాయచ్చి నన్ను మోసంసేస్తాదా? నాను నమ్మను. యేదో జరిగుండాల. యీ అడుగులజాడ పట్టిపోతే సంగతేదో తెలుస్తాది. యీడ ఏతివ్వలకీ మాపలకి జేవకే దిమ్మ—.

రచ్చించుకోవమ్మ – వోతుంగబద్రిమ్మ –
రచ్చించుకొని వుండవమ్మా

పచ్చికబయల్లోన – పారాడుతుంటాయి –
బద్రిమ్మ అవి బద్రిమమ్మా.

బోడావు – నల్లావు – బక్కావు – లక్కావు
చూడితో వున్నాయె తల్లీ !

దూడనేసే యేళ – తొందరలు లేకుండ
సూడు నీవే దిక్కు – సుమ్మా.

(పోతాడు)

---

రంగము ౨

[బెజవాడ వీధి. కొంతమంది జెండాలు పట్టుకొని పాటపాడుతూ పోతూఉంటారు. ఒకడు పాడుతూ వుంటే, వెనుక తక్కినవాళ్లు పాడుతూ ఉంటారు.]

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము
ఎండల మలమల - మండెదము
వానల వడవడ - వడకెదము
గున్ని గొంపిలో - దొరలెదము
విత్తి ధాన్యముల - నెత్తెదము
ఖామందుల పా - దాలసన్నిధిని
గ[illegible]గడమని అ - ర్పించెదము
పండించుటకు - బాధ్యులము
తినుటకే మేమతి - దీనులము
దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము
గనులను త్రవ్వగ - గడగెదము
అడుగున బడి క - ష్టించెదము
మణులను బయటికి - తీసెదము
రాజుల శిరముల - చేర్చెదము

రాజుల గుత్తలు చెల్లించుటకు ని-
రాటంకముగా - బాధ్యులము
గుత్తలు కట్టెడి - తోతులము
మాటాడగ నతి - దీనులము.

[కిత్తయ్య ప్రవేశము.]

కిత్తయ్య: నాయచ్చి నెరుకొంటూ యీవూరు సేరుకొన్నాను. ఆనాడు నూసిన పడవమీదోళ్లపనే అయి వుంటాది. యీడనయినా కనబడతాదో, నేదో!

ఒకడు: ఎవరక్కడ, నిలబడు.

కిత్త: మీరోరు? నన్నేల నిలబడమంటారు?

ఒకడు: నువ్వెవరు?

కిత్త: (తనలో) నాఅచ్చిసంగ తీశ్యతో రులచెప్పాల? (ప్రకాశముగా) నాను కూలోడిని. కూలి దొరుకుతాదేమో అని యీవూ రొచ్చినాను.

ఒకడు: యీవూళ్లో కూలిలేక మేమే యిలాగ తిరుగుతావుంటె నువ్వెకడివి చేరినావూ? మాతో చెప్పకుండా యీవూ రెందుకొచ్చినావు!

కిత్త: యీవూరు రాడానికూడా మీ ఆగ్గుండాలా? నాకు తెలనేదు.

ఒకడు: యీవూళ్ళో కూలోళ్ళంతా వొకకట్టు. అళ్ళ పెద్దలకి తెలనిదీ యెవరూ కూలిసెయ్యకూడ దీవూళ్ళో. నువ్వు యేరె కూలికిపోతే నిపానాలుండవు సూసుకో.

కిత్త: మీరు బతకా బతకరు, ఒకరిని బతకానివ్వరా? ఇదేటి అన్నాయం? మరి మీరే సూపించండి నాను కూలి మీతోనే కలుస్తాను.

ఒకడు: అయితే రా, ఈజెంగా పట్టుకో.

కిత్త: ఈజెండాయేల? నాకు జెండాలసంగతి తెలగు. యేం మాటాస్తాదో, నాకక్కరలేదు మీకిష్టం నేక పోతే మరొకూరు పోతాను.

ఒకడు: హెయ్! మాట్లాడొగ్దు! పట్టుకో, నడు. యెనకనుంటే పారిపోతావేమో; ముందునడు. మాము పాడినపాట నువ్వున్ను పాడతావుండు.

కిత్త: (తనలో) యిదేటి దేవుడా! నాయచ్చికోసం నా సెను కొక్కొంటావుంటే, యీళ్ళ సేతుల్లో పడ్డాను! కాని యేమయితే అదవుతాది.

(అందరున్ను మునుపటివలె పాడుతారు.)

దీనులమయ్యా – దీనులము
దిక్కులేని – నిరుపేదలము

మట్టిని అచ్చున - పోసెదము
ఇట్టికబట్టీల్ - పెట్టెదము
మహాలులు మహడీల్ - కట్టెదము
ధనవంతులకవి - తార్చెదము
కుములుచు మురియుచు - కూర్చుండే యి
యయ్యాల కడియేన్ - దాసులము.
మహడీల్ కట్టగ - మాన్యులము
తిరుగాడగ నతి - దీనులము.

దీనులమయ్యా - దీనులము
దిక్కులేని నిరు - పేదలము.

పట్టు నూలులను - వడకెదము
నిగ్గుల బట్టల - నేసెదము
ధనికుల కడకును - చేర్చెదము
వన్నెల మెప్పుల - మర్చెదము
సౌఖ్యము సోలుచు - చూచేఅయ్యల
పాదము అనుబడి - పట్టెదము
బట్టల నేయగ - పరిబలులము
బట్టలు గట్టగ - బడుగులము.

[పోలీసులు ప్రవేశము]

పోలీసు: ఎయ్, నిలబడండి.

ఒకడు: ఏందు నిలబడేది లేదు. ఈబాట నీదా? నువ్వెవ్వరు మావుర్లి నడ్డపెట్టడానికి?

పోలీసు: నేనెవరా? తెలిపిస్తానుండు. నీ పేరు?

ఒకడు: యింతమం నుంటావుంటే నా పేరే యేల చెప్పాల? అసలు మా పేరడగడానికి నువ్వెవ్వరు?

పోలీసు: ఏ, జవాన్, ఎయ్, ఈడికి బేడీలెయ్.

(వెనకవాళ్ళందరూ పారిపోతున్నారు.)

ఒకడు: పోలీసయ్యా, ఈడు (కిస్టయ్యను చూపి) రమ్మంటే వొచ్చి నాము. మాకేమీ తెలదు.

పోలీసు: ఎవడీడు? కొత్తమొగంలావుందే. ఎయ్యాండి బేడీ ఈడికికూడా.

కిస్ట: ఏంరా, యిలాసెస్తేంవు? నామీన నాను పోతావుంటే నన్ను బయటంపెట్టి, సేతులో యీజెండాయెట్టి ముందుకు తోసి, మళ్ళీ నామీద పడతావా? యెంతన్యాయంకాల మొచ్చింది!

ఒకడు: ఈడేనయ్యో. యీడే (పారిపోతున్నారు)

పోలీసు: పట్టుకోండి, పట్టుకోండి (కొందరు పోలీసులు వారి వెంట పరుగెత్తుతారు.) నువ్వు నడు. ఠేసనికి నడు.

కిష్టి: పోలీసప్పా, నన్నెందుకిట్లా సేస్తావు? నా కేకర్మమూ తెలదప్పా. నా నిదినమే యీవూరొచ్చినాను. యీ ళ్ళోళ్లంతా నన్ను సంపుతామని బయపెట్టి, యీ జెండా నా సేతులో పెట్టినారప్పా!

పోలీసు: ఎయ్, మట్లాడకు. తిన్నగా నడు. నువ్వోళ్ళకి మొనగాడివి.

కిష్టి: లేదప్పా, నాయచ్చి నెదుక్కుంటా వస్తుంటే, యీళ్లొచ్చి రుపడ్డారు.

పోలీసు: నీ యచ్చెవరు?

కిష్టి: నాముద్దులచ్చి, నాపాటలచ్చి, నాకు కనబడకుండా పోనాది.

పోలీసు: అచ్చో, బుచ్చో! యీకదలన్నీ కట్టిపెట్టి. నడు. టేసను కాడే అంతా సెప్పుదువు గాని.

కిష్టి:

గాచ్చారమోరు త - ప్పిస్తారురా - నుదుటి
రాత నెవ్వరు తుడి - సేస్తారురా.

తల్లిదండ్రుల నిడిచి - తనవారిని యిడిచి
తరవాత యేరూనా - తల సంగతేమైతి గాచ్చార.

అచ్చె నాలోకమని - అచ్చుంగ నమ్ముకొని
మెచ్చి చేరదీస్తి - దాచ్చొరగలినాకు గాచ్చార.

కొంప కూలిపోయె — గొడ్డు గోదలుపోయె
కొసకి పోలీసోళ్ళు — కొట్టొతోస్తున్నారు గా)చార.

పోలీసు: ఒరే, యేం నడవవు? ముడ్డుపోటుకావాలా?

కిస్తు: పదండప్పా, పదండి. (పోతారు.)

తెర.

---

## రంగము ౬.

(బెజవాడ వీధి– ఇద్దరు పడవవాళ్లు, అచ్చి, ప్రవేశము.)

అచ్చి: నీ తలకా యొడిపోను! నీ యమ్మకడుపుకాల! నన్నేడ కిరా తీసుకొచ్చినారు?

ఒకడు: ఎయ్, నోరుముయ్, గట్టిగా అర్సినావంటే నోరు నొక్కేస్తాం.

అచ్చి: మీకడుపులో అగ్గొయ్యా! మీమచ్చమాసిపోను! మీ యిల్లు కూలిపోను! నానోరు నొక్కుతారా? ఓరురా మీరు? దొంగగాడి దల్లారా! కిత్తయ్యో, కిత్తయ్యా, మామోయ్, మామా! ఏడనున్నావురో! రావేమిరో! నా బతు కద్దాన్న మయిపోయెరో! నాకోరు దిక్కురో!

రెండో: ఓపిల్లా, యినుగో నామాటయినను. కేకలేస్తే మంచిపని కాదు. నీకూ మాకూకూడా ముప్పొస్తాది. యీదులో పోయే వోళ్ళంతా యిని సుట్టూ మూగుతారు.

అచ్చి: యింటేయినని, మూగుతే మూగని అందరితో సెప్పేస్తా, మీరుసేసినపని. మీకొంపకి కొరివిని. మీపానాలమీది పిడుగుని. మిమ్మల్ని నాశనం సేసేస్తా. నాకిత్తయ్యకి తెలుస్తే మీకీభూమిమీద రుణంతీరిపోతాది. నామాట యినండి. నన్ను నాకిత్తయ్యకాడికి సేర్సియ్యండి.

ఒకడు: ఇదుగో, అచ్చీ, నామాటింటావా, యినవా? నీకిత్తయ్య సచ్చిపోనాడు. మ రాడా శెట్టికోకు.

అచ్చి: నా కిత్తయ్య సచ్చిపోనాడా? మీగొంతుకలు కోర కయ్యా! అడిదగ్గిరికి తీసుకుపోతామని మభ్యపెట్టి, యీడకు తీసుకొత్తారా? మీనాలికలు తెగ్గొయ్యా! మీకళ్ళు పేలిపోను! మీకాటిలో మూడువేటల బుగ్గియెత్తిం చెయ్యకుండా వూరుకొంటా ననుకొన్నారరొరి?

రెండో: (నవ్వుతూ) ఏమచ్చీ, యిదుగో!

అచ్చి: మీనవ్వు నాశనంగాను! మీపొగరణిగిపోను! మీకు పెళ్లాలు లేరంటారి? మీ కక్కసెల్లెళ్లు లేరంటారి?

ఒకడు: నువ్వే మాపెళ్లాం. మాబావకి నువ్వు సెల్లెలివి.

అచ్చి: మీనోరూడిపోను! మీసిగాదరగా! ఓకిత్తయ్యో. కిత్తయ్యా! రారో! యీళ్ళనుంచి నన్నుతప్పించుకోరో! ఏడ నున్నావురో!

(పోలీసులు, కిత్తయ్య, ప్రవేశం.)

పోలీసు: నడు, నడు! దిక్కులు సూస్తావేం? పారిపోడానికా?

కిత్త: నాను పారిపోనప్పా! నాఅచ్చేపోయింది నాకీలోకంలో మరో యున్నారు? నడవండి—

పోవావె - నాయచ్చి - ముద్దుల - నాయచ్చి
పోనావా - యిడిసి - పోనావా - అచ్చి
రావా - నన్నేలు - కోవా

అచ్చి: ఓహో - కిష్టయ్యా - వోయసునా - కిష్టయ్య
మాటసెప్పియెళ్ళి - పోరో - కిష్టయ్య
రారో - యిడిపించు - కోరో.

కిష్ట: తెల్లనా - కౌశాన - నల్లమ - బ్యాట్టింది
కళ్ళలో - మెరిసింది - కన్నీరు - కమ్మ్రింది
రాయే - నన్నప్పు - కోయే - నాయచ్చి.

అచ్చి: పాశేటి - నీళ్లలో - పడవపో - తుండంగ
పడవోరిగి - పోయింది - రయ్యో - కిష్టయ్యా
యెడబాపు - వొచ్చింది - మనకో - కిష్టయ్యా.

కిష్ట: నడిమింటి - సూర్యుణ్ణి - మిడినాగు - పట్టింది
మింటిలో - సీకట్లు - మించిపో - తున్నాయి
పాడాని - కేవారి - పాడగట్ట - కున్నాది
రాయే - నిచెయ్యి - యియ్యే - నాయచ్చి.

అచ్చి: కొరడవి - లోపల - కన్నుగా - నకుండ
దారి త - ప్పిపోయె - దరిదాపు - లేదాయె
వోరు ది - క్కవుతారు - రయ్యో - కిష్టయ్యా
రారో - రచ్చించు - కోరో.

కిత్త: అదుగదుగదుగో, నాయచ్చి! (పోబోతున్నాడు.)

పోలీసు: హెయ్, నిలు, ఎటుపోతావు?

అచ్చి: అదుగదుగో, నాకిత్తయ్యా! (పోబోతున్నది.)

ఒకడు: హెయ్, నిలు, ఎటుపోతావు;

కిత్త: అచ్చీ! అచ్చీ!

అచ్చి: కిత్తయ్యా మామో! కిత్తయ్యా మామ!

కిత్త: నన్ను నాయచ్చికాడకు పోనియ్యండి.

పోలీసు: పోడాని కీలులేదు. నడు.

అచ్చి: నాను నాకిత్తయ్యా కాడకు పోతాను. పోండి, నా కాడకు రాకండి.

రండో: పోనువ్వుగాని, పాపం! మాబంగార మేడదాసినావో ముందుసెప్పు.

అచ్చి: మీబంగార మేటి!

ఒకడు: మాపడవలో నెట్టుకొన్నది నువ్వేతీసినావు. ముందదీసి పెట్టిపో. నేకపోతే పోలీసోళ్ళ కొప్పజెప్తాం.

అచ్చి: మిమ్మల్నే నానొప్పజెప్తాను. మీనాలికాడిపోను! నన్ను మోసంనేసి, నానా అల్లరాపెట్టి, నాను దొంగతనం

కూడా కడతారంటార్రి? వో పోలీసప్పో! పోలీసప్పా! నూడప్పా, యీళ్ళేలా సేస్తున్నారో!

పోలీసు; ఎవరురా, అచ్చి? ఆడదాన్నలా అల్లరపెడుతున్నారేటి?

ఒకడు: మామేమీ సెయ్యడంలేదు. అయమ్మే మమ్మల్ని అల్లర పెడుతున్నాది.

రెండో: నూడప్పా, పోలీసూ, మాపడవెక్కి, కేవియ్యకుండా, సల్లంగా దిగిపోయింది. మాము పడవలో నెట్టుకున్న బంగారమేడనో దాచీసింది. నువ్వయినా యిప్పించియ్యాప్పా!

పోలీసు: ఓపిల్లో, అల్లకేవు, అళ్ళ బంగారమూనంట, ఇళ్ళకిచ్చెయ్. ఆడదానివికావూ? జెయిలుకి పోవాలనున్నాదేటి నీకున్న?

అచ్చి: నూసినావా, మామా, యీళ్ళెంతవా దేస్తున్నారో?

కిత్తయ్య: ఏమచ్చీ. నువ్వు దొంగతనం సేసినావంటనే?

అచ్చి: బూదేవి సాచ్చిగా, మామా, నా నేపాకమూ ఎరగను. ఈళ్ళు నన్ను మోసంసేసి, మనిద్దరికీ యెడబాపులు సేసినారు, మామా!

ఒకడు: ఎయ్, అబద్దాలాడతావా? "కిత్తయ్యతో సాను పడలేకుండావున్నాను. నన్ను బందరు దిగబెట్టెయ్యండి" అని మాపడవెక్కలేదూ? ఇక్కడి కొచ్చినతరవాత, మాకే

విడ్యాకుండా, మాబంగార మంతా యాడనో వాచీసి, అదు కనబడగానే దొంగేడుపు లేడుస్తావా?

కీర్తి: అవునా, అచ్చీ? నానునీకు సేదయిపోనానో! పో, పో, ఆళ్ళతో నేపో.

అచ్చి: మామా, యీదొంగ నాయాళ్ళమాట నమ్మొతున్నావా! మీకూటిలో దుమ్ముపడ! మీకాటి కగ్గెట్టా! యెటాగ్రి, పేలినారు?

పోలీసు: ఎయ్, బాటలో అల్లరసేస్తున్నారు. మిమ్మలి నందరిని అరెస్టుసేసినాను. నడవండి. స్టేషనికి.

కొండో: మా మేమి సేసినామప్పా, మమ్మలిని నడమంటావు?

పోలీసు: మీ అందరికి ఏదోసంబంధముంది. అంతా కోర్టులోనే తెలుస్తాది పదండి.

అచ్చి: పదండి, నాకు భయంనేను. నానూ, నాకీర్తయ్యా కలిసి నడుస్తాము. ఈళ్ళ నేరేవుంచు, పోలీసప్పా.

ఒకడు: మాకు మాతర్రిం బయమా? నడు. కాని, పోలీసూ, ఆళ్ళిద్దరూ దగ్గరగుంటే మాట్లాడుకుంటారు. ఆళ్ళని కలియనియ్యాకు.

పోలీసు: సరే, ఓపిల్లా, నువ్వాళ్ళదగ్గరా ఉండకు, ఈడిదగ్గరా ఉండకు. నాయెనక నుండు. నడు. (పోతారు.)

తెర.

---

## రంగము ౭.

(బెజవాడ మేజిస్ట్రేటు కోర్టు. మేజిస్ట్రేటు, వకీళ్ళు, కూర్చొని ఉంటారు. గుమాస్తా మేజిస్ట్రేటు ప్రక్క నిలుచొని ఉంటాడు. పోలీసు కాన్స్టేబిలు, కిత్తయ్యను, అచ్చిని, పడవవాళ్ళను తీసుకొని ప్రవేశిస్తాడు.)

మేజి: ఎవరోయి, పోలీసు, ముద్దాయీలను బోనులోని కెక్కించు.

పోలీసు: పదండి, దానిలోని కెక్కండి. (ఎక్కుతున్నారు. వాళ్ళ ప్రక్కను పోలీసు నిలబడుతున్నాడు.)

కిత్త: అచ్చీ, యీపక్కకిరా, (అచ్చి వస్తున్నది.)

పడ: ఒకడు: దేవరా, అళ్ళిద్దరూ ఒకసోట వుండగూడదు. మాట్లాడుకొంటారు.

మేజి: సరే, వేరేవేరే ఉండండి.

అచ్చి: ఏమిం, దేవరా, మాకు నాయ మివ్వవా ? యిప్పుడే ము-మ్మల్నెడము సేసేస్తున్నావే !

గుమా: ఓ అమ్మీ, 'దేవరా' అనకూడదు. తప్పు. 'బాబయ్యా' అనాలి, లేకపోతే 'మహాప్రభో' అనాలి. 'దేవరా' అంటే ఘనమైన కోర్టువారి నవమానించిన ట్లవుతుంది.

అచ్చి: అదేమిగోలో. మామట్లాగే అనేది. గనమో, గినమో, మాము పలకనేము, అంతింతమాటలు.— ఓయప్పో, నన్నుమాత్రం 'అమ్మో' అనబోక. తరవాత మాటొస్తాది.

మేజి: ఏమే, తిన్నగా మాట్లాడలేవూ?

అచ్చి: దేవరా, నువ్వు గొప్పోడివయితే అయినావుగాని, నన్ను 'ఏమే' అనిమాత్రం పిలక! నానేమి నీపెళ్ళాన్నను కొన్నవా?

మేజి: ఏమని పిలవాలి?

అచ్చి: 'ఏమమ్మో' అనాల.

మేజి: సరే, నీ పేరేమిటి?

అచ్చి మాపేరలా సెప్పకోము. కిస్తయ్యా నడగండి, సెస్తాడు.

మేజి: దానిపేరేమిరా?

కిస్త: 'రా' అనకు, దేవరా. అట్టంటే మాకుతప్పు.

మేజి: బాగుంది. నిన్నేమనాలి?

కిస్త: 'ఏమప్పా' అనాల.

మేజి: నువ్వొచవాచవా. 'అప్పా' అనడానికి?

కిస్త: యీదేసంలో అప్పలందరూ ఆడోళ్ళుగావాల. మా దేశంలో అప్పలు మొగోళ్ళే.

మేజి: నీదేవూ రప్పా?

కిత్త: మాది రుదగ్రింపేట.

మేజి: ఎక్కడుంది, అరుదగ్రింపేట?

కిత్త: యింత సమువుకోనోళ్ళు, రుదగ్రింపేట యాడనుందో తెలదా?

మేజి: యేజిల్లా? యే తాలూకా?

కిత్త యావ జిల్లావో, యావతోలుకావో! నీకే తెలకపోతే, సమువుకోనోడని నాకిలా తెలుస్తాది?

మేజి: ఓయి, పోలీస్, అవూ రెక్కడుందో కనుక్కోని చెప్పు.

పోలీ: చిత్తం.

మేజి: నీపేరు?

కిత్త: కిత్తయ్య.

మేజి: నీతండ్రిపేరు.

కిత్త: వోబలేసు.

మేజి: ఏం, హాస్యంచేస్తున్నావా? కోర్టువారి ధిక్కారం క్రింద నిన్ను ప్రాసిక్యూషన్ చేస్తాను చూడు.

కిత్త: ఏమచ్చి, అయ ప్పలా కోపంసేస్తాడేల?

పోలీ: ఎయ్, మీరలా మట్లాడుకో కూడదు.

అచ్చి: పోలీసో, అయప్పే టంటాడో మాకు తెలనేను. కరుస్స బుస్సు మంటున్నాడు. గిక్కార మంటాడు! పిసికేస నంటాడు! అర్ధంకానేను.

మేజి: నీతండి పేరేమిటో నిజంగా చెప్పు.

కిత్త: వోబలేసని సెప్పినానుకానా? మరోడికో పుట్టినానని చెప్పమంటావా యేటి? యిది బాగుందే!

మేజి: నుర్వబద్ధ మాడుతున్నావు. వోబలేసని యెక్కడనయినా పేరుంటుందా?

కిత్త: వుండదో? మావూరొస్తే యెంతోమంది కనబడతారు వోబలేసులు, వోబయ్యలు, వోబన్నలు.

ఒక వకీలు: అదేశములో అటువంటి పేర్లుండవచ్చును. ఘనమైన కోర్టువారు నమ్మకపోవడానికి కారణం కనబడదు.

మేజి: సరే.—ఓయమ్మో!

అచ్చి: అమగో, మరీ అదేమాట!

మేజి: ఓ యమ్మా, నీపేరేమిటి?

కిత్త: దానిపే రచ్చి.

మేజి: సరే. నీభర్తపేరు?

అచ్చి: బరతంటే?

పోలీ: నీ యింటోడి పేరు,

అచ్చి: (కిత్తయ్యవైపు చూస్తుంది.)

మేజి: ఓహో, వాడేనా నీభర్త?

అచ్చి: వాడూ!

మేజి: అయ్యప్పేనా?

కిత్త: అవును, నానే దానింటోడిని.

పల్లి: కిత్తయ్య అబద్ధమాడుతున్నాడు. వాడు దీనిభర్త కాడు.

అచ్చి: వోరలా అనేది?

మేజి: ఇది ఒక ఇన్స్యూగా చేర్చమంటారా?

పల్లి: చిత్తము.

మేజి: సరే.—(ఒక పడవవానితో) నీపేరు?

1 పడ: మొర్రెడ్డి.

మేజి: ఇదేమిపేరబ్బా! సరే, నీతండ్రిపేరు?

1 పడ: బయ్యాప్పరెడ్డి.

మేజి: (రెండో పడవవానితో) నీపేరు?

2 పడ: కొట్రియ్య.

మేజి: ఇదేమి వేళాకోళ మనుకొన్నావా? ఎవరినికొట్టమంటావు?

2 పడ: అయ్యో, నాపేరే అది. దేవరా!

మేజి: బాగుంది. తండ్రిపేరు?

2 పడ: చిక్కబసణ్ణ

మేజి: చిన్న—గానేవుంది, యీపేరు.—మీమీది ఛార్జీలను చెప్ప-తాను, వినండి.—కిత్తయ్యా, నువ్వు కమ్యూనిస్టులతోచేరి, జెండాపట్టుకొని, డిమాన్స్ట్రేషను చేస్తూ, యీ వూళ్లోని ధనవంతుల యిళ్లమీదపడి, దోచుకొనే ఉద్దేశముతో కాన్స్పిరసీ చేసిన అన్‌లాఫుల్-ఎసెంబ్లీలోచేరి, పోలీసువారు చెదరిపొమ్మని ఆర్డరుచేసినా పోక, చక్రవర్తిగారి న్యాయచట్టము నతిక్రమించినావని పోలీసువారు నీమీద కేసు తెచ్చినారు. ఆ నేరము చేసినావా?

కిత్త: నువ్వనేమాట నాకేమీ తెలవలేదండీ.—పోలీసూ, ఏమే టిదంతా? కమ్మ్యూంటంట, దిం దిం అంట, అడోరంట, కంచిపెసరంట, అల్లం బెల్లమంట, యేం గోల తెచ్చి-పెట్టినా వప్పా!

మేజి: ఏమండీ, పబ్లిక్ ప్రాసిక్యూటరుగారూ, వీనికి కేసు స్వభావము తెలియజెప్పండి.

ప్లీ: ఓ కిత్తయ్యా, నువ్వు తర్డ్ ఇంటర్నేషనలకు చేరినవాడవు గదా!

కిత్త: తా డింటనే సాలంటూరా! నాకుబోధపడ్డం నేదు.

ప్లీ: ఎయ్, వెంకిపాట లాపకు. నువ్వీదేశములో బోల్షి- విక్ ప్రాపెగేండా చేయుతలపెట్టినావా, లేదా?

కిత్త: బోడిసివ్వులేటో, పొర్రిగింజేటో, నాకే.. మీ తెలదు.

అచ్చి: నా కెంబారి మావో! నిన్ను బోడిసేసేస్తారంట పోరప్పకొండకు సేరుస్తారంట. అ కొండేటుందో! నువ్వేమి సేసినావు. మావా? నిన్నూ నన్నూ యిడదీ- సేస్తారు గాబోల, మావో!

మేజి: పోలీస్, దానిని మాట్లాడవద్దని చెప్పు.

అచ్చి: 'దానిని'! సుతి మించిపోతున్నాదే!

ప్లీ: ఘనమైన కోర్టువారు వీనిముఖవైఖరిని కనిపెట్టవలెను. వీ- డేమీ తెలియనట్లు నటిస్తున్నాడు.

మేజి: చూస్తున్నాము,—కిత్తయ్యా, నీపక్షాన్ని వకీలు నెవరినైనా పెట్టుకొన్నావా? నువ్వే వాదించుకొంటావా?

కిత్త: అంతింత పెద్దమాటలాడినాడు, ఆయప్ప వోకీలుకాడా? ఆయన్నే వోదించమనండి.

మేజి: ఆయన ప్రాసిక్యూషన్ తరఫున వాదిస్తారు. డిఫెన్సుకు నువ్వు వకీలు నేర్పాటుచేసుకో. చేసుకోకపోతే, నువ్వే వాదించుకోవాలి.

కిష్ట: పాప్రసిక్కునేటో, డిప్పినే సేటో! వోదమంటే నాకు బయం. వోడిస్తే అదేటి సిక్కులొస్తాయో!

మేజి: సరే, మేమే ఎపోయింటు చేస్తాము. శ్రీనివాసరాఘవయ్యంగారు గారూ, మీరుకిత్తయ్య పక్షాన్ని వాదిస్తారా?

శ్రీ. రా అ: ఎనక్కు ఫీజు హానరబిల్ కోర్టువర్ వేరుప్పాడు సెయ్యావాల.

మేజి: సరే, కేసు పెంత్తంమీద రు. ౫ లు ఏర్పాటు చేసినాము.

శ్రీ. రా. అ: నా స్టేటస్ అలోసిచ్చినాక్క్ కారే. ఎంతెంత లాపాయింటుగళ్ వేణ్డుమ్! ఎన్నా కదెయ్!

మేజి. మీకక్కరలేదా? మరెవరికైనా యేర్పాటు చేస్తాము లెండి.—వకీళ్లుగారూ, మీలో ఎవరికైనా యీ కేసులో వకాల్తా కావలిస్తే, వ్రాతమూలకముగా తెలియజేసుకోవచ్చును.

[వకీళ్లు చీట్లువ్రాసి మేజస్ట్రేటు కిస్తారు.]

మేజి: చూచినారా, శ్రీనివాస రాఘవయ్యంగార్ గారూ, నిష్కారణంగా రు. ౫౦ ఫీజు పోగొట్టుకొన్నారు. నేను

చెప్పగానే ఒప్పుకొని ఉంటే యెంత బాగుండేది! హనుమంతప్పగారు రూ. 4 లకే చేస్తామన్నారు.— ఇదెవరి దీచీటి? జగన్నాథంపంతులుగారు,— రు 2-5-4 లకే చేస్తారట. వీరెవరో?— రాధానాధన్ గారు. (చదువు తున్నాడు) "ఈకేసు ఇంటర్నేషనల్ ఇంపార్టెన్సు కలది. కమ్యూనిజం, కమ్యూనాలిజం; బోల్షివిజం, బోల్ట్రాయిజం; బహుమూరిజం, బలాదూరిజం; డూ—అర్—డై ఇజం, యస్—యువర్—ఆనరిజం;— మొదలయిన యెన్నో సమస్యలతో కూడుకొనిఉన్నది. ఇంత ముఖ్యమైన కేసులో పనిచెయ్యటమే యెంతో గౌరవము. ఇటువంటి విషయములో కాంగ్రెస్ సెక్రెటరీగాఉండిన నేను ఫీజుపుచ్చుకొని పనిచేయడము కంటె అవమానముండదు. హానరబిల్ కోర్టువారు అనుగ్రహిస్తే నేనూరకే పనిచేయడాని కంగీకరిస్తున్నాను. ఇన్నాళ్లున్ను తమకోర్టులో ఒక్క కేసుకూడా పట్టివుండలేదు. నే నిఊళ్లోపుట్టి, ఈఊళ్లో పెరిగి, ఈఊళ్లోచదివి ప్యాసయి, యీ ఊళ్లోనే బల్లకట్టుకొని, యీకోర్టునే కనిపెట్టుకొని ఉన్నాను. కాబట్టి. యీకేసు నాకే యిప్పించవలెనని ప్రార్థిస్తున్నాను. తమ అనుగ్రహమువల్ల ఈ కేసు గెలుచుకొంటే, నా పేరు ఋషికుల్య నుంచి పినాకిని వరకున్ను, బందరునుంచి బళ్లారివరకున్ను మోగిపోతుంది."

శ్రీ. రా. అ: ఈ కేజు రాధానాథన్ గారి కొప్ప సెప్పుకున్నాడాను. ఆయన కాంగ్రెస్ సెక్రిటరీవని తానే శొన్నేన్దా. అవను క్రావ్యడం గవర్నమెంటు పాలిసీకి విరుత్తం.

మేజ: ఆయన యెన్నడో కాంగ్రెస్ సెక్రిటరీగా ఉండేవాడు. ఇప్పుడు లేదుగా.

జగ: ఆయన యేహో డబడబాయమానంగా నాలుగు 'ఇజం' లను వినిరేసేసరికి. కోర్టువాళు గుమ్మయి పోయినారు. వాటి అర్థమేమిటో సరిగ్గా చెప్పగలుగుతే ఆయనకే యిన్య వచ్చును. యేమండీ, రాధానాథన్ గారూ, కమ్యూని-నిజం కు, కమ్యూనాలిజం కు భేద మేమిటండీ?

రాధా: నన్ను తాము క్రాసు వేస్తున్నారా? మీకు తెలియక అడుగుతున్నారా?

జగ: తెలియకే అడుగుతున్నాను, చెప్పండి

రాధా: కమ్యూనిజం అంటే అందరున్ను కలిసి పంచుకొనేది. కొన్ని కొ అపరేటివ్ సొసయిటీల దైక్కట్లవలె, కమ్యూనాలిజం అంటే అన్నీ ఒక్కడే కబళించేసేది; ఎంత తక్కువ ఫీజులకయినా, అన్ని కేసులున్ను తామేపట్టి, ఇతర వకీళ్ళకు ఒక్కటిన్ని దక్కనివ్వనితమవలె. తెలిసిందా, యిప్పుడు!— వీళ్లే మహా గొప్ప 'లా' చదువుకొన్నట్టు, మేము చదవుకోనట్టు!

హను: చాలా బాగా చెప్పినావోయ్, రాధానాథన్! అలా తగులుతూ వుంటేనేగాని యిటువంటివాళ్ళకు బుద్ధిరాదు. మనిద్దరం కలిసి యీకేసు వాదింతాము. నాకు కూడా ఫీజక్కరలేదు.

జగ: నాకుమాత్రం కావలెననా యేమిటి? ఫీజు పుచ్చుకోకపోతే క్లయింట్లు యెదుట పలుచబడతామనికాని, లేకపోతే ప్రొఫెషన్‌మీద ఉన్న గౌరవం దెబ్బతింటుందని ఉంటే, ఈపాటికి భాష్యంఅయ్యంగారంతటి వారేనా సంపాదించేనూ! సరే, నేనుకూడా మీకు సాయం చేస్తానులెండి.

హను: నేనుమాత్రం ఊరికేకూర్చొని యేమిచెయ్యాలి. పట్టండి నలుగురం నాలుగు కొమ్ములు మోసేదాం. కాని, పబ్లిక్ ప్రాసిక్యూటరుకు దినానికి రు. 85 లు, మేజిస్ట్రేటువారికి యథావిధిగా జీతం ముట్టుతవే. మనకేమీ లేదే. అది మాత్రం నాకు కడుపుమంట. శ్రీనివాస గోపాలయ్యంగారు గారూ, మీరుమాత్ర మేమిచేస్తారు? రండి మా పక్కకు. ఈకేసులో కాకపోతే మరొకదానిలో కొట్టి వారు మట్టచెప్పిస్తారు లెండి. పబ్లిక్ ప్రాసిక్యూటరు గొప్పేమిటో, టకటకలాడించేదాము.

మేజి: పేదవాళ్ళ విషయములో మీ రంత ఉదాత్తమైనబుద్ధి చూపడం, బెంచికి బారుకుకూడా గౌరవం. మీ రందరు

ముద్దాయీల పక్షాన్ని వాదిస్తారా?

రాధా: చిత్తం. మాఁలో మాకొభేద ఖేమిన్ని లేను.

మేజి: సరే, కేసుకానివ్వనా?

పల్లి: చిత్తం. కానివ్వండి

మేజి: రెండో ముద్దాయి, అచ్చమ్మా, విను. నువ్వు నీ భర్తను విడిచిపెట్టి, ఈపడవవాళ్ళతో బయలుదేరి, వాళ్ళకేవు యివ్వలేదని ఒకఛార్జి. వాళ్ళ పడవలో బంగారం దొంగిలించినావని రెండో ఛార్జి, ఏమంటావు?

అచ్చి: నాను నాకి త్తయ్యని యిడిసిపెట్టనేను. నన్ను నాకి త్తయ్యా యిడిసిపెట్టనేను. ఈదొంగనాయాళ్లు నాకబద్దాలు సెప్పి, నీకి త్తయ్యని సూపిస్తామని, పడవెక్కించి, తిప్పితిప్పి యీవూరు తీసుకొచ్చినారు.

మేజి: వాళ్లకు నీవు కె విస్వవలెనా? అక్కరలేదా?

అచ్చి: నా నెలివ్వాల? నా నేమి నన్నడకు తెమ్మన్నానా?

మేజి: వాళ్ళ బంగారం మాట?

అచ్చి: అళ్ళ మొవానికి బంగారం కూడాను. దొంగ కూతలు కూస్తున్నారు. అళ్లమీది కొత్తాదేమో అని అలాసెప్తారు.

మేజి: మొర్రక్షి! కొటర్రియ్యా! అచ్చమ్మ కబద్ధాలుచెప్పి,

లేవదీసుకొని వచ్చినారని మీమీద ఛార్జి. ఏమంటారు?

మొుకొ్రి: అ.. య్య.. య్య.. య్యయ్యో! మా మీదికే తిరిగిందే! ఏమన్నాయ మేమన్నాయం?

కొటల్రి: మాకిదేటో తెలదు, దేవరా. మాకేవు, మా బంగారం మాకిప్పించియ్యండి, దేవరా!

మేజి: అయితే, మీరా నేరం చేయలేదంటారు?

కొటల్రి: నేదు, దేవరా! ఏసొచ్చిగా, దేవుని సొచ్చిగా, నేదు.

మేజి: సరే, ప్రాసిక్యూషను సాక్షులను పిలవండి. హాజరుగా ఉన్నారా?

పల్లి: ఈకేసు స్వభావాన్నిబట్టి దీనికి సాక్ష్యం దొరకడం కష్టం. కమ్యూనిస్టులు లోలోపల పనిచేస్తూ ఉంటారు. అనేక వేషాలు వేస్తూఉంటారు. ఈ కిత్తయ్యను, ఈ అచ్చిని చూడండి. ఎంత అమాయకంగా కనబడుతున్నారో! వీరి చరిత్ర చాలా ఉన్నది. ఈ పోలీసు డయిరీలు ఎగ్జిబిట్లుగా దాఖల్ చేస్తున్నాను.

మేజి: ఈ డయిరీలవల్ల ఏమి తెలుస్తుంది?

పల్లి: ఈ కిత్తయ్య, ఈ అచ్చి, కమ్యూనిస్టుల గుంపులోనివారని తెలుస్తుంది. ఈ కేసులోని వివరములు బయలుపడితే, యిండియాలో ఈకమ్యూనిస్టు లెంత జాగ్రత్తగా, ఎంత

నేర్పుగా, ఎంత చాకచక్యముగా పని చేస్తున్నారో బయలుపడుతుంది. పోలీసువారికి తెలిసినంతమట్టుకు ఈ కిత్తయ్య అనేవాని అసలుపేరు కృష్ణమోహన్ బోస్. ఇతడు అయిదేండ్లక్రిందట బందిపోటు నేరముక్రింద కన్విక్టయి, డమ్‌డమ్ జెయిలులో ఉన్నాడు. ఒకనాటి రాత్రి అక్కడనుంచి తప్పించుకొని, సచ్చిదానందస్వామి అనే పేర సన్న్యాసిఅయి, ఇతర కమ్యూనిస్టులకు శిష్యుల వేషము వేసి, దేశములో తిరగడ మారంభించినాడు. ఈ సచ్చిదానంద స్వామిమీద కేసుపెట్టగా, క్రింది కోర్టులో కన్విక్షనయిందిగాని, హైకోర్టులో విడిచిపెట్టి-నారు. అతరువాత ఆస్వామిజాడ మరి కనబడడమే లేదు. తుదకు కిత్తయ్య అనేవేషముతో నేటికి పట్టుబడ్డాడు.

మేన: చాలా ఆశ్చర్యంగా వుందే యీకథ!

ప్ల: అచ్చమ్మ అనేపేరుగల యీరౌడీముద్దాయికథ ఇంకా ఆశ్చర్యమైనది. ఈమె మొదటిపేరు మిస్. సరస్వతీభాయి. ఈమెది బొంబాయిలోని గ్రామం. ఈమె తండ్రి తిలక్ కాలములో సుప్రసిద్ధ రాజకీయ నాయకుడైన ఛట్నీవీస్. ఈమె ధూలాశాత్‌ను పెండ్లాడినది. అతడు గవర్న-మెంటు ఉద్యోగి. ఈమెను తండ్రిసంప్రదాయము

వచ్చింది. భార్యాభర్తల కిద్దరికి పడలేదు. ఒకనాడు భర్తయింటినుంచి యీమె లేచి, బొంబాయిలో స్త్రీమ-శక్తి, రష్యా చేరుకొన్నది. అక్కడ బోల్షివిజములో తర్బీయతు పొందినది. ఐరోపామహాయుద్ధములో ఇంగ్లాండుచేరి, కమ్యూనిస్టు స్పయిగా మిస్. కెల్లర్ అనే పేర పనిచేసినది. యుద్ధమయిన తరువాత ఈదేశం వచ్చి, భర్తను కలుసుకొని, బోల్షివిజములో చేరవలసినదని ప్రేరేపించినది. ఆ భూలాబాత్ రాజభక్తితత్పరుడు గనుక ఒప్పుకోలేదు. అందుచేత అతనిని విడిచిపెట్టి, కిత్తయ్యా అనే పేరుతో తుంగభద్రయొడ్డున గుడిసె వేసుకొని కాపురముచేస్తూఉన్న వీనిని కలుసుకొని కొన్నాళ్లున్నది. వీళ్లిద్దరున్ను కలిసి దేశములో అల్లరులు లేవదీయడానికి కుట్రచేస్తూ ఉండేవారు. ఈ సంగతి పోలీసులకు తెలిసి భూలాబాతునున్ను, ఫోటాషహబత్ అనే యీ కానిస్టే-బిలునున్ను మారువేషములతో పంపినారు. ఈకొట్రయ్యే భూలాబాత్. ఈ మొరిడ్డే ఫోటాషహబత్.

సే.జి: హాఁ! ఈకథ మరీ ఆశ్చర్యంగా ఉంది. అయితే ప్రాసిక్యూషనువారు అచ్చిమీద చేసిన కేనివ్యాకపోవడము, బంగారం దొంగిలించడము, అనేఛార్జీలను వదలుకొన్నా-రన్నమాట.

పబ్లి: ఇప్పటికి కోర్టువారా నేరములను గురించి విచారించ నక్కరలేదు. కాన్స్పిరసీఛార్జి తప్పిపోతే, ఆ నేరముల క్రింద ఛార్జి చేయవచ్చును.

సెంజ: మొర్రెడ్డి, కోటిరెడ్డ్యాలమీద ఛార్జిలనుకూడా వదలు కొన్నట్టే కదా? వాళ్ళని ప్రాసిక్యూషను పక్షమున సాక్షులుగా వేసుకొంటారా?

పబ్లి: చిత్తము. కోర్టువారు వాళ్లిద్దరిని అప్రూవరుల క్రింద విడిచిపెట్టాలి.

సెంజ: సరే, విడిచినాము. (వాళ్ళిద్దరు బోనులోనుంచి బయటికి వస్తారు) మొర్రెడ్డిని సాక్షిబోనులో ఎక్కించండి. (మొర్రెడ్డి సాక్షిబో నెక్కుతాడు.) క్లార్కు, ప్రమాణం చేయించు, (గుమాస్తా ప్రమాణం చేయిస్తాడు.) కానియ్యండి, ప్లీజ్.

పబ్లి: మొర్రెడ్డీ, ఇక నువ్వు మొర్రెడ్డివి కావు. తెలిసిందా?

మొర్రె: నాను మొర్రెడ్డిని కానూ!

పబ్లి: నీ పేరు ఫోటాషహాబత్తు.

మొర్రె. మరేం!

డాఫా: కోర్టువారు లీడింగ్ ప్రశ్నలు నడుగనివ్వకూడదు.

పన్లి: మధ్య మధ్య మీా రస్డముంరాకూడదు.

జగ: ఆమాట కోర్టువారితో మనవి చెయ్యండి.

పన్లి: (మురారిరెడ్డితో) నువ్వు కాన్స్టేబిలువి కదా!

హాను: ఇదంతా వాని కింటివద్దనే నేర్చి తీసుకరావలసినది. కోర్టులో నేనా బోధచేయడం!

పన్లి: హానుమంతప్పగా రిస్టేల్లు పాక్టీసుపెట్టుకొని, ఈరీతిగా పలుకడం వింతగా ఉంది.—(మురారిరెడ్డితో) నీది బొం-బాయిలోని గిర్గాం,

మురారి: అదే.

పన్లి: నువ్వీకిత్తయ్య నెక్కడచూచినావు!

మురారి: (తనలో) మంచి చిక్కు తెచ్చిపెట్టినాడే! యేమని చెప్పాలో!

పన్లి: ఏమట్లా చూస్తావు! తుంగభద్ర ఒడ్డున చూచినావా!

మురారి: అవును. మ రేడనూస్తాను!

రాధా: ఈయ నెక్కడ చూడమంటే అక్కడే చూడు.

పన్లి: అక్కడ ఈకిత్తయ్య, అచ్చి, అనేపేర్లుపెట్టుకొన్న వీళ్లేమి చేస్తున్నారు!

మురారి: ఏం చేస్తారు! మీాకు తెలదా!

పల్లి: నువ్వు వాళ్ళ మాటలు విన్నావా?

మొర్రి: వో! యినకేం? యింటూనే వున్నా.

పల్లి: ఆమాటలన్నీ నీ డయిరీలో వ్రాసినావుకదూ?

మొర్రి: రాసినాను కానూ?

పల్లి: కోర్టువారియెదుట పెట్టిన డయిరీలోని మాటలేనా అవి!

మొర్రి: నువ్వు సెప్పినట్టే.

పల్లి: సరి.

మేజి: క్రాసు కానియ్యండి.

రాధా: నీ పేరు?

మొర్రి: మొర్రెడ్డి.

రాధా: మరేదో అని చెప్పినావే?

మొర్రి: నా నేమీ సెప్పనేదే!

పల్లి: ఫోటాషహాబత్.

మొర్రి: అవునవు నదే అయ్యప్ప సెప్పిందే.

జగ: ఏమి టా పేరు?

మొర్రి: చోడాసత్.

పట్లి: ఛోటూషహాబత్తనడానికి 'చోడాసత్' అనేది సంక్షిప్త-మైన పేరు. జగన్నాధరావుకు 'జగ్గు.' కృష్ణమూర్తికి 'కిట్టు', నరసింహావికి 'నరుసు', శ్రీనివాసానికి 'సీను' వలె.

హను: మొరెడ్డీ, నిది తురకకులమా ?

మొరె: ఏమన్నా అంటే ఒప్పుకొంటానుగాని, నన్నుతురకోడంటే మాత్రము...

శ్రీ. రా. అ: అనాల్, శోడా శరబ్బత్ పెయర్ ఎన్న ?

మొరె: ఆడేటంటాడో! కీస బీస గోల.

జగ: నీ ఊరి పేరు?

పట్లి: 'గిగ్గాం' అని యింతకుముందే చెప్పినాడు.

హను: మిమ్మలి నడుగలేను. ఛోటూషహాబత్తు నడుగుతున్నాను.

పట్లి: వాని తరఫున మేము చెప్పుతున్నాము.

జగ: అయితే, మీరే బోనెక్కి ఛోటూషహాబత్తు కండి.—ఏం, మొరెడ్డీ, నువ్వు పొయ్యేసరికి కిత్త యెక్కుడున్నాడు?

పట్లి: అడిగిన ప్రశ్నలే అడిగి కోర్టువారి కాలమును వృథాచేయకూడదు.

జగ: నే నాప్రశ్న యింతకుముం దడుగలేదు.

పట్లి: మీ రడుగకపోతే నే నడిగినానా. లేదా ?

జగ: ఏ సెక్షన్ ప్రకారం నే నడుగకూడదో చెప్పండి.

పద్మి: షెడ్యూల్సు ఆక్టు 144 సెక్షను ప్రకారము.

జగ: ఆ సెక్షను వర్తించదు.

పద్మి: ఇకముందు తమదగ్గ లా నేర్చుకొంటానులెండి.

రాధా: నీవు పోయేసరికి కిత్త య్యెక్కడున్నాడో కోర్టువారికి తెలియజెయ్యి.

మొరి: ఆవులు మేపుకొంటున్నాడు.

రాధా: ఇందాకా మాట్లాడుతూఉన్నా డన్నావే?

పద్మి: ఆవులు తోలుతే మాట్లాడకూడదా? ఏమిప్రశ్నలయ్యా. ఇది? చొప్పదంటు ప్రశ్నలు!

రాధా: కొంచెం గౌరవంగా మాట్లాడండి.—అయితే, మోటా-మాత్రికి, నువ్వు విన్నదంతా అడయరీలో వ్రాసినావుకదూ?

మొరి: రాసినాను!

రాధా: నీకు వ్రాత వచ్చునా?

మొరి: వో!

రాధా: (మేజిస్ట్రేటుతో) అడయిరీ యిలాదయచేయండి. (పుచ్చు-కొని మొర్రిడితో) ఏదీ, చదువు.

గి. రి: (చదువలేక దిక్కులు చూస్తున్నాడు.)

పల్లి: వానికి వ్రాతవచ్చునన్నాడుగాని, చదువువచ్చునన్నాడా?

జగ: వ్రాయగలిగినవాడు చదువలేడా?

పల్లి: వ్రాయగలిగిన వా రందరూ చదువగలిగితే యింకేముంది? ఇంతే మన తెలివితేటలు.

రాధా: చాలాబాగుంది.—ఇక దిగు. (దిగుతున్నాడు.)

మేజి: కొట్టయ్యా, నువ్వెక్కు—. (కొట్టయ్య ఎక్కుతున్నాడు.)

పల్లి: ఏ పేరు భూలాబాత్.

కొటయ్య: మావోళ్ళలాగే యెట్టినారు కాబోల పేరు.

జగ: కానివ్వండి, కానివ్వండి. మీయిష్టం వచ్చినట్టు కానివ్వండి.

పల్లి: నువ్వు అచ్చి అసలు మగడివి.

కొటయ్య: కాకేం?

అచ్చి: ఎవడివిరా, నువ్వు, ఏనోరాడిపోను?

కీర్తి: ఏదీ? మళ్ళీఅను ఆమాట? ఏప నేమవుతాదో!

పల్లి: కోర్టువారు ముద్దాయీల మాటలను చేష్టలను గమనించవలెను.

మేజి: చూస్తున్నాము.

పల్లి: ఇది నిన్ను విడిచి పోయింది కదూ?

కాట్రి: మరేటి?

అచ్చి: చా, నోరుముయ్!

కీర్తి: నీకు పాణాలమీ దాశ నేదా?

పల్లి: కోర్టువారి సాక్షిని రక్షించవలెను. వీళ్లెంతటికయినా తెగిస్తారు.

మేజి: ఏమీ భయము లేదు. సర్కారువారి దీర్ఘహస్తము సకల ప్రజలకున్ను అభయ మిస్తున్నది.

పల్లి: సర్కారుశక్తి ఘనమైన కోర్టువారిలో ఆవేశించి ఉన్నంత కాలమున్ను....

రాధా: మీ ముఖప్రీతిమాట లింక చాలించండి.

పల్లి: ఏమండీ, మీకుకూడా ముద్దాయీలలో చేరవలెననిఉందా యేమిటి?

వాను: మీ బెదరింపు లింక కట్టిపెట్టండి. ఘనమైన కోర్టువారు న్యాయమూర్తులు. వారు మాకున్ను న్యాయమునే అనుగ్రహిస్తారు.

పల్లి: నా ఫీజ్ సరి.

మేజి: క్రాస్!

రాధా: నీ పేరు?

కొట్రి: కొ....

పల్లి: భూ...

రాధా: ఇదుగో, వీరుండండి.

పల్లి: భూలా...

జగ: ఏమండీ, మళ్లీ తగులు కొన్నారూ?— ఇట్లామాట లం-
దిస్తూ ఉంటే, మేమీకేసులో పనిచేయలేము.

మేజి: ఏమండీ, పబ్లిక్‌ప్రాసిక్యూటరుగారూ, మీ రడ్డు వస్తూ ఉండకండి. మీకు మే మనుకూలముగా ఉన్నామని లోకమనుమానించకూడదు.

పల్లి: నేనే మన్నాను?

రాధా: నీ పేరు?

కొట్రి: నాపేరే నాకు తెలదనుకొన్నావేటి?

రాధా: ఏమిటో చెప్పు.

కొట్రి: బొబ్బట్.

జగ: బలే, బలే! ఇద్దవ కాదూ?

రాధా: అయితే అది నీభార్య అంటావు?

కోటి: మరేటనమన్నావు! నీబారియనమంటావా! కాని, అలాగే అనుకో. నన్ను మాత్రం సిక్కులోకి దింపక!

రాధా: అది నీభార్య అవునా, కాదా?

కోట: ఊహూ, 'నాబారియ' అంటాడు. ఈయన 'నాబారియ' అనమంటాడు. నువ్వుకూడా 'నాబారియ' అనుకొంటే అనుకో.

అచ్చి: ఎరోడి పెళ్లాం వాడవోడినంట. ఏమర్రా, మీకెవక్లికి బుద్దులున్నాయా, నేదా?

రాధా: మా కాస్ సరి.

మేజి: ఆర్గ్యుమెంట్లు కానివ్వండి.

పబ్లి: నేను దీర్ఘముగా ఆర్గ్యుమెంటు చేయనక్కరలేదు. ఈ-కొత్తయ్య, అచ్చి, అనేవాళ్లు కమ్యూనిస్టులు. వీళ్ళకు తగిన శిక్ష వేయకపోతే ఈలోకమంతా తల్లకిందయి-పోతుంది. కాబట్టి, ఇట్టికేసులు కోర్టులలో జరుగకుండా ఉండేటట్లు పెద్ద శిక్ష విధించవలెనని ఘనమైనకోర్టువారిని ప్రార్థిస్తున్నాను.

మేజి: రాధాసాగర్ గారూ, మీరు కానివ్వండి.

రాధా: ఈదేశములో కమ్యూనాలిజమేగాని కమ్యూనిజము లేదు. బహుదూరిజమేకాని బొల్షివిజము లేదు, నామినాలిజమే కాని నేషనాలిజమసలే లేదు, షోకిల్లాయిజమేకాని సోషలిజమే లేదు. ఈవిషయమై నేను ప్రమాణము చేసి చెప్పగలను. నన్ను చూడండి. నేను కార్యదర్శిగానో, అధ్యక్షుడుగానో, కార్యనిర్వాహక సభ్యుడుగానో లేని సంస్థ లేదు. నేను కలుగజేసుకోని ఉద్యమమే లేదు. నా అనుభవమును బట్టి మనవి చేస్తున్నాను. అవన్ని సురక్షితముగా లేవని ఎవరు చెప్పగలరో చెప్పమనండి.

పల్లి: అవి ముందుకు నడుస్తే కదూ? తమపరిభాషమటువంటిది!

రాధా: అవునామరి? అదే నేనంటున్నది. చూచినారా, ప్రాసిక్యూషనువారుకూడా నాతో ఏకీభవిస్తున్నారు. వారికి నేను కృతజ్ఞుడను....ప్రస్తుతపు కేసులో ఈ కిష్టయ్య, అచ్చి, అనే ఈముద్దాయీలు కేవలము అమాయకులు. వాళ్ళ మొగాలు చూస్తేనే అది తెలుస్తుంది. ఈ మొ[ల్]రెడ్డి, కొటిరియ్య, అనేపడవవాళ్ళు అచ్చిని మోసము చేసి తీసుక వచ్చినారు.

పల్లి: అయితే, పోలీసువారు తప్పుడుకేసు పెట్టినారంటారా?

జగ: మావాద మదికాదు. పోలీసువారు తమ ధర్మమును శ్లాఘాపాత్రముగానే నిర్వర్తించుకొన్నారు.

హను: పోలీసువారు పొరపాటుపడ్డారని మాత్రము మావాదము.

శ్రీ. రా. అ: అమ!

రాధా: నేను మాత్రము ప్రాసిక్యూషనువారి ఊహ కవకాశము లేదంటూనా? కాని....

మేజి: సరే లెండి. ఇకచాలు.

రాధా: ఘనమైన కోర్టువారు...

మేజి: ఇక కూర్చోండీ!

రాధా: మహాఘనమైన కోర్టువారు...

మేజి: ఏమండీ, చెప్పితే వినబడదూ, సిట్ డౌన్ ప్లీజ్.

రాధా: చిత్తం, చిత్తం. (కూర్చుంటున్నాడు.)

మేజి: ఇదుగో తీర్పు చెప్పుతున్నాను—

ఈకేసు చిన్నదంటే చిన్నదనుకోవచ్చును: పెద్దదంటే పెద్దదే అనుకోవచ్చును. ముద్దాయీలను విడిచిపెట్టడానికి కారణములున్నవి; శిక్ష విధించడానికి కూడా కారణములున్నవి. వీళ్లు అమాయకులనడానికి అవకాశమున్నది. కుట్రమనుష్యులనడానికిన్ని అవకాశమున్నది. ఇట్టి సందిగ్ధవిషయములో ఏమి చేయవలెనో క్రిమినల్ ప్రొసీజరు కోడ్డులో సూచనలేదు.

రాగా: బెనిఫిట్ ఆఫ్ ది డౌటు అక్యూజుడుకు ఇవ్వవలెనని ఉంది.

ప్లీ: లేదు, ఎంత మాత్రమున్నూ లేదు. అట్లాచేస్తే సంఘానికి దేశానికికూడా గొప్ప ఉపద్రవము జరుగుతుంది.

మేజి: మేమిూ రెండు విషయాలను గమనించినాము. అందుచేత మేము చెప్పే తీర్పేమంటే, "ఈకిష్టయ్యాను, అచ్చిని విడిచి పెట్టుతున్నాము."

కిష్ట: అదీ, అదీ, అట్లా ఉండాల. ధర్మప్రభువులు—రాయె, అచ్చీ, పోదాము.

అచ్చి: నాకిష్టయ్యా, నాకు మళ్ళీ సిక్కినావా? (కౌగిలించు కొంటున్నది.)

మేజి: ఎయ్, కోర్టులో అటువంటిపనులు చేయకూడదు. నా-తీర్పు పూర్తిగా వినండి—"కిష్టయ్యాని, అచ్చిని తుంగభద్ర ఒడ్డున వాళ్ళగుడిసెలోనే ఇంటర్న్ చేస్తున్నాము....

కిష్ట: అంటే?

మేజి: అంటే మిూరాస్థలములోనే ఉండవలెను. విడిచిరాకూడదు.—వస్తే, మిమ్మల్ని పోలీసువారు ఎరెస్టుచేస్తారు.

అచ్చి: ఒకసారి అనుబవమయింది. యింకా రావడమే! ఈ శిచ్చ మాబాగుంది కిష్టయ్య యెల్లకాలం నాకాడనే వుంటాడు. రా, మామా, పోదాము.

మేజి: ఉండండి. ఇంకా తీర్పుకాలేదు. వీళ్ళిద్దరూ ఈమధ్య తోవలో ఎక్కడయినా దాటిపోతారేమో, అందుచేత, కొటర్రియ్యా, మొర్రిడ్డి, తమపడవలో వాళ్ళగుడిసెకు దిగబెట్టవలెను.

కొటర్రి: మాకేంపట్టింది? అళ్లనే పొమ్మనండి.

మేజి: హెయ్, మాట్లాడకూడదు. వాళ్లను దిగబెట్టినట్టు మాతో వచ్చి చెప్పాలి. ఓయ్, పోలీసు, వీళ్లుదిగబెడ తారో లేదో, నువ్వుకూడా వీళ్లతోపోయి, తిరిగీవీళ్లని కోర్టులో హాజరు పెట్టు. నీకు ప్రియాణం బత్తా యిప్పిస్తాములే.

పోలీ: చిత్తం.

గుమాస్తా: ఈదినానికి కోర్టు బర్తరఫ్!

(అందరూ పోతున్నారు.)

(కొత్తయ్య, అచ్చి పాడుతారు)

ఇద్దరున్ను: పోలో - పోలో - పొంగాలి - పోలో
పొంగాలి - లోకాలు - సింగార - ముతోను - పోలో.

కిత్రయ్య: రాజుగా - రింట్లోను - రాణులే - వుంటేను
రంగైన - నాయచ్చి - నారాణి - అవుతాది - పోలో.

అచ్చి: రాచనూ - తుళ్ళకి - రాచకొడు - కులుంటె.
రంగుకి - త్రడునాకు - రాచకొడు - కృష్ణుడు - పోలో



